***Araadhana***
*Telugu Poetry*
*by* ***BVV Prasad***


| | | |
|---|---|---|
| © | : | Poet |
| First Edition | : | December 1989 |
| Art on cover | : | Royal arts, Palangi |



| | | |
|---|---|---|
| Poet's Address | : | B.V.V. Prasad<br># 23-12-21, Sajjapuram<br>TANUKU W.G.Dt 534 211 |
| Phone | : | 90320 75415 |
| Email | : | prasadbvv1@gmail.com |
| Website | : | bvvprasad.blogspot.in |



| | | |
|---|---|---|
| Printed at | : | Ravi Printers, Tanuku |
| Price | : | Rs. 5 |

# ముందుమాట

ఇది ఈ రచయిత వెలువరించిన మొట్టమొదటి కవితాసంపుటి. ఈ రచయిత పేరు బివివి ప్రసాద్. ఇట్లెందుకు చెప్పవలసి వచ్చినదనగా ఈతని పేరు ప్రవరల కంటే ముందుగా రచయితగనే నాకు పరిచయమైనారు కనుక. మా మిత్రులు శ్రీ జి.ఎస్.వి. నరసింహారావుగారు ఈ రచయితను నాకు పరిచయ మొనర్చి, వీరి కవితలను పరిశీలింపవలసిన అవసరమును కల్పించిరి. మేమిద్దరమూ కలిసి ఈ రచనలను చదువుకొన్నాము.

భావుకుడగు రచయితకు ఉండవలసిన ఔత్సుక్యమంతయూ ఈ రచయితలో పుష్కలముగా నున్నది. గుండెల లోతులలో కదలాడిన భావచ్ఛాయలు అభివ్యక్తిలో స్పష్టత సంతరించుకొనువేళ కావలసినంత పదసంపద అందుబాటులోనికి రాక అరవిరిసిన కుసుమము నుండి మకరందము నాస్వాదించు పుష్పంధయమునకు వలే పాఠకులకు భావతలములను తడిమి చూడవలసిన శ్రమ ఆవశ్యకమగుచున్నది. అందులకే అభ్యాసం మరింతగా ఈతని భావి రచనలను తీర్చిదిద్దవలసి యున్నది.

భాష సరళ సాధారణ వ్యావహారిక శైలిలో నడచిననూ, తత్తాదృశ సంస్కారమునకు పొంగి పొరలిన ఈ రచయిత హృదయము ఆ బాసలోనే తన చేతనైన వాలకములతో అభినయించుటకు సమాయత్తమైనది. ఒక విధముగా ఆయా సందర్భములలో, ఆయా ప్రసంగములలో అలతి అలతి రూపములకు దిద్దిన అక్షర రూపములు ఏకత్ర సంగ్రథితములై ఈ రచయిత భావములకు అద్దము చూపుచున్నవి.

ఇందలి ముగ్ధభావముల అందచందములు భావనా సామాన్యమున పరిణతి చెందిన సహృదయ పాఠకులకు, ముద్దు గొలుపక మానవు. ప్రథమ ప్రయత్నమైననూ, ప్రకృష్ట యత్నముతో మది గుది గూర్చిన ఈ కవితారాధన ఈ రచయితకు ఆత్మసంతృప్తితో పాటు, భావి రచనా సముదాయమున ప్రౌఢిమా, పరిపూర్ణతలను కలిగింప వలయునని నిండు మనస్సుతో కోరుకొంటున్నాను.

తణుకు — చెరువు సత్యనారాయణశాస్త్రి

డిసెంబర్ *1989*

## నా మాట

నన్ను నేను వెదుకుకొనే ప్రయత్నమే ఇందులో ఉన్నది. ఇతరులలో తనని గుర్తించటాన్ని ప్రేమ అంటారనుకొంటాను. ప్రేమని తెలియచేయటంలో ఆరాధన ఒక పద్ధతి. ఆరాధించబడే వస్తువుని బట్టి, అది అనేక పేర్లతో పిలవబడుతుంది. ఏ పేరుతో పిలిచినా ఆరాధన లక్ష్యం, ఇతరులతో తాను మరింతగా ఐక్యం పొందటమే.

ప్రకృతి, స్త్రీ, అనుభూతులు, ఈశ్వరుడు వేటిని ప్రేమించినా, ఆ ప్రేమ తీవ్రమూ, గాఢమూ అయ్యే కొలదీ అది అన్నిటిపట్లా ప్రేమగా పరిణతి పొందుతుంది. ప్రతి ఒక్కదానిలో మిగతా అన్నిటినీ చూడగలుగుతాం.

అంతలోనే ప్రేమ, అంతలోనే సంశయం, అంతలోనే కాంక్ష, అంతలోనే విరక్తి. మనం ప్రేమించే వాటిపట్ల కలిగే భావాలన్నీ నిజానికి మనపట్ల మనకు కలిగేవే. మనల్ని మనమే తెలుసుకొనే ప్రయత్నమే. మనం కల్పించుకొన్న బంధనాల్నుంచి స్వేచ్ఛ పొంది, మన ఉనికిని మరింత స్థిరంగా, భద్రంగా నిలబెట్టే ప్రయత్నమే ఇదంతా.

చివరికి వీటన్నిటా ఉన్నది మనమే అనీ, మనల్ని తెలుసుకోవటానికి అవరోధాలు మనలోనే ఉన్నాయనీ గ్రహించి, ఆ అవరోధాలని తొలగించుకోవటం ద్వారా మోక్షమనీ, సత్యమనీ, ఈశ్వరుడనీ పిలవబడే "నేను"ను తెలుసుకొంటాం.

ఈ పుస్తకం ఏ కొద్దిమందికో రసానందాన్ని కలిగించినా, ఏ కొద్దిమందికో నూతనాన్వేషణకి దారులు చూపినా, ఏ కొద్దిమంది సందేహాలకి సమాధానాలు ఇవ్వగలిగినా, సమస్యల నుంచి ఉపశాంతిని ఇవ్వగలిగినా ధన్యమైనట్టే.

సవిమర్శల ద్వారా, సందేహాల ద్వారా నేను ఎంతో నేర్చుకోవాలను కొంటున్నాను. రసజ్ఞులైన విమర్శకులకూ, జిజ్ఞాసువులకూ ఇదే ఆహ్వానం.

నా కోసం తమ అమూల్యమైన కాలాన్ని వెచ్చించి, నా కవిత్వంలోని తప్పు ఒప్పులని ఓపికగా తెలియచేస్తూ, అవసరమున్నంత మేరకి సాధ్యమైనంత వరకూ సంస్కరించిన శ్రీ చెరువు సత్యనారాయణశాస్త్రిగారికి నా కృతజ్ఞతాభివందనాలు.

నా పట్ల శిష్య వాత్సల్యంతో, కవిత్వం రాయటంలో మొదటినుండీ ప్రోత్సాహమిస్తున్న మా గురువుగారు శ్రీ జి.ఎస్. నరసింహారావుగారికి ఇప్పటికీ, ఎప్పటికీ విధేయతా పూర్వక అభివందనాలు.

సాధ్యమైనంత అందంగా ముద్రించి ఇచ్చిన రవి ప్రింటర్స్, తణుకు వారికి, చక్కని ముఖచిత్రాన్ని గీసి ఇచ్చిన రాయల్ ఆర్ట్స్, పాలంగి వారికి ధన్యవాదాలు.

తణుకు బి.వి.వి. ప్రసాద్

డిసెంబర్ 1989

# మరొక మాట

యాదృశ్ఛికంగా పాతనోట్సులు తెరచి చూస్తూ, 'ఆరాధన' సంపుటిలోని కవితల మూలరచనలు చదివినపుడు, ఆశ్చర్యంగా అనిపించింది. వాటిలో కొన్ని పరిష్కృతదశ కన్నా మూలంలోనే బాగా అనిపించాయి. మరికొన్ని బాగున్న కవితలనే ఏ కారణం చేతనో అప్పుడు పుస్తకంలో చేర్చలేదు.

ఒక కవి రాసిన కవితను సరిచేయటం సాహసం చేయబోవటమేనని, వీటి సవరణకి పూనుకొన్నపుడు మరోసారి స్పష్టమైంది. రాసిన కవి అయినా, రాసినప్పటి భావావేశాన్ని చేరకుండా, మళ్ళీ ఆ కవితని తాకలేడు అనిపించింది. అందువలన చాలా కవితలు మూలంలో ఉన్నట్లే ఉంచేసాను. కొన్నిటిలో కొన్ని పదాలనో, వరుసనో మార్చాను.

ఈసారి కవితలను కాలక్రమా న్ననుసరించి కూర్చాను.

తోచిన ప్రతి అనుభూతినీ, ఆవేశాన్నీ కవిత్వంగా రాసుకోవటం ఒక దశ. జీవనమూలాల్నీ, అర్థాన్నీ వెదుకుతూ, మహాకవుల, జ్ఞానుల మాటల్లోంచి, వాటిని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తూ, తన అనుభవాన్ని రాసుకోవటం మలిదశ. దానికి ప్రారంభం ఈ 'ఆరాధన' కవితల కాలం. ఈ మలిదశనే ఈనాటికీ కొనసాగుతూ వుంది.

కవితాసామాగ్రిని ఏమంత ఉపయోగించకుండా, నిర్మలంగా, నిరాడంబరంగా, అస్తిత్వవేదననుండి ఉబికిన భావాలనీ, వేదన ఫలితంగా మేలుకొంటున్న అవగాహననీ అక్షరీకరించటం ఈ కవితలలో చూడవచ్చును.

ఒక మార్మికజీవుడి తొలినాళ్ళ అస్తిత్వవేదన, సౌందర్యస్పృహ వీటిలోంచి కోమలంగా తాకుతున్నట్టు అనిపించింది, ముప్పైయేళ్ళ తరువాత వీటిని చదువుకొంటుంటే. తదనంతరం జరిగిన, సాహిత్యయాత్రకి మూలాలు వీటిలో స్పష్టంగా కనిపిస్తాయి. ప్రసాద్ కవిత్వాన్ని ఇష్టపడే మిత్రులకి ఈ కవిత్వం కూడా సాంద్రమైన అనుభూతిని ఇవ్వగలదని ఆశిస్తూ..

తణుకు — బివివి ప్రసాద్

***29.11.2017***

'నిన్ను నీవు తెలుసుకో' అని ప్రబోధించిన

భగవాన్ శ్రీ రమణమహర్షి కి

*1*

ప్రభూ!
నిన్ను సేవించుదామని
ఎన్నో సుందరపుష్పాలు ఏరి తెచ్చాను

తుదకు
వాటి సౌందర్యంపై మోహంలో
నిన్నే విస్మరించాను

*26.2.85*

## 2

ఈ ప్రపంచం ఆశ్చర్యకరం
ఇక్కడ నా ఉనికి సైతం ఆశ్చర్యకరమే
ఒక్కక్షణం అంతా బావుంటుంది
మరుక్షణం ఊహ విప్పారుతుంది

ఇదంతా శాఖోపశాఖలమయమై కనిపిస్తుంది
ఇన్ని భిన్న కోణాలు, స్థితుల మధ్య
ఎలా వుండాలో తెలియదు, వెళ్ళవలసిన మార్గం తోచదు
దు:ఖంలోంచి, ప్రశ్నలలోంచి ఒక అవగాహన మొలకెత్తుతుంది

అణువుల్లా విస్తరిల్లిన ఈ అల్లిక వెనుక
అంతటికీ మూలమేదో ఉందనిపిస్తుంది
ఆ లేత అవగాహన ఆనందాన్నిస్తుంది

ఆ క్షణంలో ఏది ప్రపంచం, ఏది నేను
అంతా నేనుగా ఉన్న తానే
ఆ క్షణంలో పక్షికన్నా, చీమకన్నా తేలికైపోతాను
మబ్బులోకన్నా, మంచులోకన్నా చిన్న నీటికణమై విహరిస్తాను

భేదాలకి మూలమైన తనను తెలియటం వల్ల
భేదాలన్నీ మరిచిపోతాను
తుదకు తానూ, నేనూ కూడా మాయమౌతాము
తండ్రీ! ఆ ఉండీ, వుండని నీవే నేను కదా

*17.11.85*

*3*

పరమాత్మ
అందమైన భాషలో
అందంగా రాసుకొన్న పేరు
ఈ నక్షత్రాలు

*5.3.86*

## 4

అంతులేని కన్నీటి ద్వారా
నాలోని మాలిన్యమంతా పోతుందంటే
జీవితాంతం కన్నీటినే రాల్చుతాను
దానిలోని తృప్తి పూర్ణమైనది

*5.3.86*

## 5

లౌకికుడు కవిని వ్యర్ధుడని తలచినట్టే
కవి లౌకికుని వ్యర్ధునిగా తలుస్తాడు

'దైవం మనకి
అంతులేని కాలాన్నీ, అరణ్యాలనీ ఇవ్వలేదా
ప్రకృతి మనని ఆనందింపచేయదా

అది భయ పెట్టే సమయాల్లోనూ
ఆ భయంలో ప్రేమ వుంటుంది

ఏనాటికైనా కష్టంలేని సుఖం సృష్టించగలవా
నువ్వు తయారుచేసుకొన్న కష్టం
నీ అహాన్ని వెక్కిరించదా

కష్టంలేని సుఖం వుంటుందనే
అది అనుభవించటం నీకు తెలుసుననే
నీ భ్రాంతిని చూసినపుడల్లా

నువు కోల్పోతున్న జీవితానుభవాన్ని తలచి
జాలి కలుగుతుంది' అంటాడు కవి

*5.3.86*

*6*

ఈర్ష్యా, ద్వేషమూ నన్ను కాల్చుతూ వుంటాయి
భరించలేక, తండ్రీ వీటిని తొలగించు అంటాను

మరలా తెప్పరిల్లి చూస్తాను
అవి ప్రేమతో ప్రసాదించావు నీవు
నాకేమి కావాలో నీకు తెలుసనే విషయం
నేను మరిచినట్టు గ్రహించాను

వివిధ ఆభరణాల బరువులు నాపై మోపి
న న్నీ భూమినుండి తేలిపోకుండా కాపాడుతున్నావు

అవి నన్ను కాల్చుతున్నా
నా సహచరులతో కలిపి వుంచుతుంటాయి

*20.3.86*

*7*

ఈ ప్రపంచాన్ని
ప్రేమగా కావులించుకొన్న నీ చేతులే
రాగద్వేషాలు, మంచిచెడ్డలు
నాకు తల్లి పొత్తిళ్ళవి

ఆమె స్పర్శా సౌఖ్యమూ, భద్రతా
రెండిటిలోనూ ఇమడటం వల్లనే కలుగుతుంది

వాటి ద్వారానే
ప్రేమ ప్రవహించి
నన్ను ప్రకాశింపచేస్తుంది

*24.3.86*

## 8

వేలయేళ్ళ ముందునుండీ
మన కోసం ఇక్కడ రంగం సిద్ధమౌతూవుంది

తరువాతి వేలయేళ్ళకు
మనం రంగం సిద్ధం చేస్తాము

ఈ రెండిటి మధ్యనున్న బిందువు
మనం దర్శించే జీవితం

మనం ఈ రోజు కన్నా
నిన్నా, రేపే ఎక్కువ కాలం
ఈ భూమిపై వుంటాము

*3.4.86*

*9*

మృత్యుస్పృహ
మన మనస్సులో
ప్రధానమైన అంతర్వాహిని అయ్యేకొలదీ

మన జీవితాలలో, అనుబంధాలలో
లాలిత్యమూ, ప్రేమా
ఉన్నతంగా దర్శనమిస్తాయి

*3.4.86*

*10*

నీవు సమీపించినపుడు
పూవు ఇలా అంటుందేమో

'నన్ను ప్రభువుకి అర్పించనక్కరలేదు
నన్ను చూసిన క్షణంలో
కాలం వుందని మరిచిపోగలిగితే
నిన్నే ఆయనకు అర్పించుకొన్నవాడివి కాగలవు'

*3.5.86*

## 11

హోరుగాలిలో, చీకటిలో
ఆతృతగా నీ వద్దకు వచ్చాను
నిన్ను చూడటం కన్నా పరమార్థ మేముంది

మసకచీకటిలో నిలిచిన నీ రూపాన్ని గమనించాను
నీతో మాట్లాడే సమయం రాలేదనిపించి
ఆగకుండా వెళ్ళిపోయాను

నీ సౌందర్యాన్ని వినమ్రతద్వారా ప్రకాశింపచేస్తావు
నిన్ను చూసి నా అల్పత్వానికి సిగ్గుపడతాను

మంచీ, చెడూ వదిలేసాను
నీ కోసం పని చేయటమే ఆనందం నాకు

నీవూ నేనూ దూరంగా ఉన్నప్పుడు
మనిద్దరి మధ్యా ఐక్యతని
మరింత స్పష్టంగా చూస్తాను
నేనంటూ విడిగా వున్నానా
అది నీకూ తెలుసు

*17.5.86*

## 12

విశ్వమా! విశ్రాంతి లేని నీ నర్తనలోనికి
నన్ను ఆహ్వానించినందుకు కృతజ్ఞుడిని

నిట్టూర్పులు విడుస్తూ కదిలే కాలం
జాలిగా నన్ను చూసి నవ్వుతుంది
బాధని ఆహ్వానించకుండా
బ్రతకాలన్న కోరిక లేదు నాకు

గాలి చల్లగా భుజంపైన చేయి వేస్తుంది
సాయంత్రం పక్షులు విశ్రాంతిగా
అరుణాన్ని తాకుతూ ఎగురుతుంటాయి

సముద్రం ఒడ్డున నేను
నాకు లభించిన జీవితాన్ని తలుచుకొని గర్వపడతాను

*25.9.86*

## *13*

పుష్పం వికసించిన రోజున
మధుర మాతృభారంతో మైమరచిన తీవె
మృదువుగా గాలిని స్పృశిస్తోంది

నిశ్శబ్దాన్ని పలకరిస్తూ
పిట్టలు ధ్వనులు చేస్తాయి

విశ్వసీమల నుండి స్వగృహానికి వచ్చిన శిశువు
ఉల్లాసంగా కాళ్ళూ, చేతులూ ఆడిస్తోంది

నవ్వే ఆమె కంటిలో వెలుగు ప్రతిఫలిస్తోంది
లోకంలోని బంధువులంతా
వికసిత వదనాలతో శుభాకాంక్షలు చెబుతారు

దినదినమూ పుట్టినరోజుగా అలంకరించుకొని
కాలం తనకు స్వాగతం చెబుతుంది

*29.9.86*

## 14

నా కన్నీటిధార, ఆమె మౌనవేదన

మా  ఇద్దరి మధ్యనుండి
అనంతవిశ్వానికి వ్యాపించిన దిగులు
దాని బరువువల్ల నిట్టూరుస్తుంది
లోకానికి తాను పాతదానినే అని చెప్పుకొంటుంది

దాని జాలి ఆలాపన
లోకంలోని సంతోషంనుండి బహిష్కరింపబడింది

రాత్రి వెన్నెలకి వణికే నక్షత్రాలూ
ఉదయ మంద్రపవనానికి ఊగే వికసిత పుష్పాలూ
లోకంలోకి  విశాలత్వంతో, స్వేచ్ఛతో చేతులు చాపుతాయి

పాతదనం అనేదే తమకి లేనట్టు
నూతనత్వంతో తొణికిస లాడుతాయవి

వాటి కోమలస్వరం
లోకంలో సంతోషం వినా ఏమీ లేదని చెపుతుంది

ఔను, నా ప్రాచీనదుఃఖమూ
ఈ విశ్వరసకేళిలో ఒక భాగమయే వుంటుంది

*19.10.86*

## 15

నాకు సంతోషం కలిగినప్పుడు
దానిని పంచుకోగలవారి కోసం
వెర్రిగా చుట్టూ చూసాను

చిరునవ్వుతో నీవు కనిపించావు
నా సంతోషం మాయమైంది

నాకు దు:ఖం వచ్చినపుడు
దానిని వినగలవారి కోసం
ఆశగా వెదికాను

చిరునవ్వుతో నీవు కనిపించావు
నా దు:ఖం మాయమైంది

*25.11.86*

## 16

పరాత్పరా,
నీవు తప్ప వేరేదీ నన్ను తాకనీయకు
నీ ఆనందమయ స్పర్శ లోనికి కరుగనివ్వు

నీ దయ వలన
నీ కరుణను తెలుసుకొన్నాను
అనంత సృష్టిపై ప్రసరించే ఆ కరుణ
తర్కానికి అందనిది

మా వెలుపలా, లోపలా
మా కాల, కర్తవ్యాలా
నిండి వెలుగుతున్న నీ చిరునవ్వు చూస్తున్నాను
నీ దయ వలన

నీ కోసం పడిన దు:ఖం
నిన్ను చూపించటం వలన అమూల్యమౌతుంది

అనంత సంతోషాలతో, దు:ఖాలతో దహించి
నీ సామీప్యమొసగే ప్రభూ,
ధన్యుడను నీ వలన

*11.12.86*

### 17

నేస్తం!
మృత్యు నివేదితమై
ఉదాత్తమౌతున్న జీవితంలోకి నిన్ను ఆహ్వానిస్తున్నాను

పడవ కడలి తీరం విడిచేటపుడు
నా సజల సంతోష నయనాలు
వీడ్కోలు చెప్పే నీ చేతులకై వెదుకుతాయి

నా లేమి ఏదో నా స్వంతానికి ఉండనీ
లేశ మాత్రం సంపద కలిగినప్పుడు
నీతో పంచుకోవటం వలన దానిని పెరగనీ

తెల్లవారక ముందే వాకిట నిలిచే అతిథికి
ఆతిథ్యం ఇవ్వగలిగేవి
ఉదయ పవనమూ, నీ చిరునవ్వూ నేస్తం

జన్మలు గడుస్తాయి
కానీ, మన మధ్య మేలుకొన్న మౌనం
మనలను దేవతలను చేస్తుంది

నిశ్శబ్ద సాయంకాలం
చివరి రెమ్మ గాలికి వీడ్కోలు ఇస్తుంటే
నన్ను గుర్తుకు తెచ్చుకొంటావా

నీవు ఒంటరిగా ఉన్నపుడు
ఏ ఉన్నతమైన సంతోషమో నీలో ప్రవేశించి

మంచి, చెడ్డలతో  నిండిన
సకల విశ్వాన్నీ ప్రేమించేలా చేయగలిగితే
అప్పుడు
నన్ను కూడా తెలుసుకొనే ప్రయత్నం చేయి

*27.12.86*

*18*

నిర్విరామంగా చూస్తూ వున్నా
కడలి పొంగు విసుగు కలిగించదు

ఈనాటి గులాబిమొగ్గ
తిరిగి నన్ను తన వైపుకి ఆకర్షిస్తుంది

చిరుగాలి ప్రతి తరగకూ
మనసు కేరింతలు కొడుతోంది

వాటి నూతనత్వం వానిలోనిది కాదు
వాని వెనుక దాగొని చిరునవ్వు నవ్వే
నీదే ఆ సౌందర్యం

*29.12.86*

## 19

నేనొక అల్పునిగా
నీ దగ్గర బయట పడటం
నాకు ఇష్టం లేదు

తండ్రీ, నీ నుండి
నన్ను దాచుకోవాలని కాదు
నా ప్రయత్నం

నీ సమక్షానికి కూడా
అల్పత్వాన్ని మోసికొని రావడం
నిన్ను అవమానించట మేమోనని నా భయం

*29.12.86*

## *20*

సంతోషఫలమో, దు:ఖఫలమో
తెలియకుండా వచ్చే కన్నీరు

ప్రభూ ,
నిన్ను పూజించటానికి
నీవు నాకు ప్రసాదించిన సంపద

*2.1.87*

## 21

నదిలో పడిన రాయి
క్షణకాలం కలకలం రేపింది
నిశ్శబ్దతరంగాలతో ప్రవాహం
మరలా ప్రారంభమైంది

అరణ్యంలో పిట్ట కూత కూసింది
ఆ కూత దిక్కులు చేరి
నిశ్శబ్దంతో తిరిగి వచ్చింది

విభుని కోసం కాంత నిట్టూర్పు విడిచింది
తిరిగి ఆమె శ్వాసలో అతను జీవిస్తున్నాడు

*4.1.87*

## 22

నేను చూస్తున్న ప్రతి ముఖమూ
నాకు చిరకాలం నుండీ పరిచయం గలదనిపిస్తుంది
నా కనుల పడే ప్రతి సౌందర్యమూ
ఇంతకు మునుపే నా స్వంతమనిపిస్తుంది

నన్ను నా నుండి విడదీసుకొని
నాలో కలుపుకోవాలని ఆరాటపడటం
ఒక ఆట కాబోలును

. . .

అంతం అంతంగా సుందరమైనది కాదు
అనంతం అంతాన్ని
తన సౌందర్యానికి ఉపయోగించుకొంటుంది

గానం గానంగా దివ్యమైనది కాదు
మౌనం గానాన్ని
తన దివ్యత్వాన్ని వ్యక్తం చెయ్యటానికి ఉపయోగిస్తుంది

*23.1.87*

## 23

దేని కోసం ఈ చీకటిలో, వెలుగులో
కనులు చించుకొంటూ తడుముకొంటున్నానో
అది నావద్దనే ఉన్నదని తెలుసు

కాలంతో ఆడుకొనే ఈ ఆటలో అలసట వచ్చినపుడు
కాలం భుజానికి చేరగిలబడి
జేబులో నుండి దానిని తీసి చూసుకొని, సేదదీరుతాను

నాకు అది ఇవ్వు, ఇది ఇవ్వమని
లోకాన్ని పదేపదే సతాయిస్తాను
అది అలసిపోయినప్పుడు, కొంటెగా నవ్వి
'నాకేమీ అక్కర్లేదులే' అంటాను

సముద్రం ఒడ్డున ఓపికగా పిచుకగూడు కడతాను
లేచి నిలబడి దానిని చిందరవందర చేస్తాను
కూలబడి దానిలో మొహం దాచుకొంటాను

అంతలో ఆకాశంవంక చూస్తాను
చురుకుగా లేచి అక్కడి నుండి పరుగుతీస్తాను

*27.1.87*

## 24

బాట వెంట వృక్షాలు ధ్యానంలో మునిగి ఉన్నాయి
నీవు నడిచి వచ్చినపుడు మహారాజ్ఞీ
చెట్ల నీడలకు చైతన్యం వస్తుంది

ఆకాశపు అవతలి భాగాన్ని స్వంతం చేసుకొన్న
నీ కన్నుల ప్రకాశాన్ని నేను కూడా చూసాను

రాలిపడిన పువ్వులు బాట నిండా పరుచుకొన్నాయి
గాలి తాకితే నిరుత్సాహంగా మూలలకు కదులుతాయి
ఆ దైన్యసమూహంలోని పూవుగా నిట్టూర్పు మాత్రమే నా సంపద

క్షణకాలపు జీవితం ఎలాగూ కడతేరిపోతుంది
నీ ముఖబింబానికి చిరుగాలి కెరటాన్నైనా అర్పించలేకపోయాను
దేవీ! నీ మృదు పద సంరక్షణ లోనైనా నా ఆఖరిశ్వాస విడువనివ్వు

*19.2.87*

## *25*

పగటి ఆకాశం పరధ్యానంగా వుంది
సమస్త రణగొణ ధ్వనుల లోలోపలినుండి
యాంత్రిక జీవనాన్ని మించిన
మౌనసంగీతం వినవస్తుంది

గాలి సవ్వడి సందేహాల సమూహంలా వుంది
అది తృప్తికి కూడా చిహ్నంలా తోస్తుంది

ఒంటరిగా నిలబడిన మానవుడు
సమస్త ప్రపంచాన్నీ తనలో చూస్తున్నాడు

*25.2.87*

## 26

కురిసి వెలిసిన ఆకాశానికి
మేఘం గొడుగు పట్టింది
దుమ్ము అణగిన నేల నుండి
వేడి ఆవిరి పైకి లేచింది

కిటికీల నుండి చూసే పిల్లలందరూ
వీధులలోకి ఉరికారు
కాస్త విశ్రాంతి అనంతరం
ఊరు ఉత్సవం జరుపుకొంటుంది

ఆ సమయంలో
వారిలో ఒకరినై నేనూ అక్కడ జీవించాను

*13.3.87*

## 27

ఏ ప్రత్యేకమైన ఆస్తినీ నాకు ప్రసాదించకు
ఏ ఒక్కదానికో అంటుకొని
అన్నిటికీ దూరమయ్యే దుస్థితి కలిగించకు

మనసు అంతస్తులలో దాగివున్న
ఆశయాలనీ, జ్ఞాపకాలనీ, ధ్యానాలనీ తుడిచివెయ్యి

గాలి రాకపోకలకి ఆటంకం కలిగించని
బాగా తెరిచిన కిటికీలా వుండాలి నా కనులు

విశ్వ సంగీతాన్ని వినటంలో
ఎటువంటి పాండిత్యాన్ని కూడగట్టుకొనీ
అడ్డుపడకూడదు నా మనసు

సృష్టి లయలకి నిలయమైన
నడిసముద్రంలోని అలలా
ప్రశాంతంగా గమించాలి నా శ్వాస

*13.3.87*

## 28

కాలవాహిని వెంట మరొక దినం కదిలిపోయింది

ఈనాటి భానూదయం
కాలయవనికపై రేపటికి వెలిసిపోతుంది
రాత్రుళ్ళు దు:ఖించే నదులు
పగటి గాలికి ఉల్లాసంగా నవ్వుతాయి

సూర్యకాంతి
రాత్రులు సమస్తవస్తువులకీ దూరంగా విసిరివేయబడుతుంది
పగటి ప్రతి సంతోషమూ, బంధమూ
స్థిరంగా దానితో సంధిచేసుకొనే ప్రయత్నం చేస్తుంటాయి

కాంక్షలూ, సందేహాలూ, వ్యాకులతలూ
ఎన్ని విధాల నడిస్తే ఏమి
ఎన్ని రూపాలు ధరిస్తే ఏమి
దిగులుగానో, ఆశగానో, తృప్తిగానో
'ఇది ఇంతే' ననుకోవటమే అన్నిటికీ సమాధానం

ఇప్పుడొక గాఢమైన నిట్టూర్పు
అనంత మౌనానికి దారితీస్తోంది

*24.3.87*

## 29

అన్ని రోజుల లాగానే ఆ రోజు రానే వస్తుంది

మరణశయ్యపై చివరి క్షణాలలో ఇలా అంటాను
'పువ్వుల వలే, నక్షత్రాల వలే, వెన్నెల వలే, కెరటాల వలే
జీవితాలను పంచుకొన్న స్నేహితులారా ధన్యవాదాలు'

జీవితాంతం నీడలా వెంటాడి బాధపెట్టిన వ్యక్తి
కళాహీనుడై సమీపంలో నిలబడితే
ఈ పెదవుల వేడి చల్లారే ముందు
చివరిముద్దు అతని చేతిపై ఇస్తాను

*4.4.87*

## 30

బాధ వస్తుంది, పోతుంది
బాధ లేకపోవటమే సుఖం
సుఖం ఎక్కడ వుంది లోకంలో

కెరటం విశ్రమించిన అనంతరం
చిరుగాలి తెరవచ్చి అంది కదా

సుఖం వస్తుంది, పోతుంది
సుఖం లేకపోవటమే బాధ
బాధ ఎక్కడ వుంది లోకంలో

*4.4.87*

## 31

తండ్రీ, నన్ను కాపాడు

కొండలోయలు ప్రతిధ్వనించేలా అరవనివ్వు
మేఘాలలా తల బాదుకోనివ్వు
నీటిలా, గాలిలా, అగ్నిలా అవ్యవహితంగా రోదించనీ
తుపానులో కడలిలా సుడులు తిరగనీ, చెలరేగనీ

నిన్ను చేరాలన్న కోర్కె, నీవు కావాలన్న కోర్కె
బాధనైనా మిగలనివ్వు బయటిలోకం నుంచి

అసంతృప్తితో నిండుకొన్నది మంచుతెర
వెలుగు, వెలుగు
మూలమూలల్నీ తడిమి స్పృశించే వెలుగునివ్వు

తండ్రీ, నన్ను కాపాడు

*10.4.87*

## 32

నేను లేని రాత్రి కూడా చంద్రుడు
తన విధికి ఆలస్యంగా రాడు
అన్వేషకుల ఏ కదలికల్నీ అతను మరచిపోడు

కాలం మాయం చేసిన ప్రేమికుల రోదనలన్నీ
అతని హృదయంలో వుంటాయి
తన దీర్ఘనిశ్వాసం
విరహతప్తుల హృదయాలకు ఊరటనిస్తుంది

గడిచే ప్రతిక్షణానికీ
మృదువుగా వీడ్కోలు పలికే అతను
వెన్నెలనుండి ఏ క్షణమూ విడిపోడు

ప్రశాంతమైన అతని ధ్యానం
అనాదినుండి ముందుకాలాలకు
దయగా విస్తరిస్తూ వుంటుంది

*10.4.87*

## 33

నిన్ను చేరటానికి
సంతోషమే సాధనంగా అనుగ్రహించు
నిత్యమైన సంతోషం
అహం నశించటం వల్లనే అనుగ్రహించు
అహం నాశనం
నిన్ను చేరాలనే కోరికవల్ల కలిగేలా అనుగ్రహించు

నిన్ను చేరే వరకూ సంతోషమే నీవుగా తెలుసుకోనీ
నిన్ను చేరే వరకూ అహమే నీవుగా తెలుసుకోనీ
నిన్ను చేరే వరకూ కోర్కెలే నీవుగా తెలుసుకోనీ

నా బాధలన్నిటి జన్మస్థానం నీవు కావాలి
నా కోర్కెలన్నీ నీచుట్టూ పరిభ్రమించాలి
నా అనుభవాలన్నిటి తాత్పర్యం నీవు కావాలి
నా సమస్త మనోవలయాలకి ఆధారం నీవు కావాలి

*20.4.87*

## 34

సూర్యాస్తమయాలన్నీ వృధాగా కదిలిపోతున్నాయి
లంగరు ఎత్తని పడవ తెరచాపలా గాలికి కొట్టుకొంటుంది మనస్సు

గాలి తాకిడికి చిరుదీపం ఊగిసలాడుతుంది
నీ మృదుహస్తాల మధ్య రక్షణ నివ్వు

జనసమూహం మధ్య దారి తప్పి ఏడుస్తున్నాడు పిల్లవాడు
నీ ఒడిలో, స్పర్శలో అతనిని నిదురింపచేయి

ఆలస్యాన్ని భరించని విరహాంగన వలే దగ్ధమౌతుంది మనస్సు
నీ నిరంతర మృదు ప్రేమవర్షంలో దానిని శాంతింపచేయి

సంపదలు సర్పాలలా వెంటవచ్చి కాటేస్తున్నాయి
సర్వరోగహరణా రక్షించమని వేడుకొంటున్నాను

*24.4.87*

35

కడలిలో ఒదిగే వాన చినుకుని చూసినప్పుడు
నీవూ, నేనూ ఒకటే అన్న సత్యం నాలో నిలిచి ఉండనీ

శీతలోదయం పచ్చగడ్డిపై పరుచుకొన్న మంచుతెరలని చూసినప్పుడు
విశ్వమంతా నేనై ఉన్నానన్న విషయం గుర్తులో ఉండేటట్లు చెయ్యి

సృష్టి సౌందర్యం ఈ కంటిలో ప్రతిఫలించినప్పుడు
ఆ మేలిముసుగు వెనుక వున్న నిన్ను కనుగొననీ

విశ్రాంతి కలిగించే వేణుగానం చెవుల పడినప్పుడు
సమస్తమూ తృటిలో నాకు స్ఫురించేటట్లు చెయ్యి

నీవు వస్తున్నావన్న సంతోషంలో, ఆర్తిలో
క్షణాల్ని కరిగించివెయ్యి

నిన్ను సమీపించానన్న ఆతృతలో
వేగంగా దూరాల్ని మాయం చెయ్యి

*25.4.87*

*36*

రాళ్ళకు కొట్టుకున్న కెరటాలు నీటిలోనికి జారుతున్నాయి
చలిమంటలు శీతల పవనాలతో ఆటలాడుకొంటున్నాయి
మేఘాలు జారే నీటికి మెరుపులతో వీడ్కోలు చెబుతున్నాయి
గాలి మౌనంతో చేయి కలిపి చివురాకులను స్పృశి స్తోంది

పరవశాన్ని పొందుతున్న వాటి కాంతినీ, చైతన్యాన్నీ చూసి
ఆనందమా నీ వెలాంటి దానివో కనుగొన జూస్తాను

*26.4.87*

## 37

నీకు భిన్నంగా భావించే ప్రతిదానిపైనా
నాకు స్పృహ లేనంత పరధ్యానాన్ని కలిగించు

నీవు ప్రతిఫలించే ప్రతిదానిపైనా
నాకు స్పృహ లేనంత ప్రీతిని పుట్టించు

*26.4.87*

## 38

దీపం కాంతికి
వస్తువులు వేయి అందాలతో ప్రకాశిస్తున్నాయి
గాలితెర విసురుకు
దీపంతో పాటు అంధకారంలో కలిసిపోయాయి!

వివిధ వర్ణాల విన్యాసంతో
సూర్యునికి ఎదురు నిలిచింది నీటిబుడగ
అది ప్రేలినా
ప్రవాహం ఏ నిమిత్తం లేకుండానే సాగిపోయింది!

దిక్కులని ఏకం చేసే దిశగా
గాలిపటం ఎగిరిపోతుంది
దాని త్రాడు తెగినప్పుడు
అది ఏ దిక్కు పోయిందో ఎవరికీ తెలియదు!

*2.5.87*

## 39

కనుల ఎదుట కదిలిపోతున్నా
ఎవ్వరూ గమనించని రుచులన్నీ
నీ అనుగ్రహం వలన  అనుభవం లోనికి వచ్చాయి

దాగుడుమూతలు ఆడే పిల్లవాడు
దొరికినట్టే దొరికి తప్పించుకొన్నట్టు
ఎంత ప్రయాణం నీకోసం జరిగినా
ఇంకా నిన్ను చేరకుండానే ఉన్నాను

వర్షానంతరపు మేఘాల కన్నా శుద్ధంగా చేసావు
వాగునీటి కన్నా సరళంగా చేసావు
గాలికన్నా తేలికని చేసావు

నీవు ఏమీ చేయలేదనే వెర్రి మనసు
నీ అనుగ్రహానికి ఎదురుచూస్తుంది

నీకోసం ఏమీ చేయనక్కరలేదని
నీవే నా భుజం తడుతున్నావు
ఆర్తి మాయమైపోతుందన్న భయమే నానుండి పోలేదు

ప్రయాణాలు వద్దు. పరాకులు వద్దు
తండ్రీ,
నీవు కావాలి. నీవే కావాలి

*4.5.87*

## 40

ఎండిపోయిన గడ్డి
నూతనత్వపు యాత్రలో వెనుకబడి వుంటుంది
ఎండుటాకుల చప్పుడు
ఆర్తనాదానికీ దూరమౌతూ శూన్యానికి అర్థం అన్వేషిస్తుంది

కాలి బూడిదైన కట్టెలు
తమనుంచి మాయమైన బలాన్ని చూసి దిగులుగా నవ్వుకొంటాయి
వాసనా, కాంతీ నశించిన పూవులు
వచ్చి, పోయిన సౌందర్యానికి మౌనంగా ఆశ్చర్యపడతాయి

నూతనత్వంలో, సవ్వడిలో, బలంలో, సౌందర్యంలో
నీవున్నావని కనుగొననివ్వు
వెనుకబాటూ, అన్వేషణా, దిగులు నవ్వూ, ఆశ్చర్యం
నీ క్రీడలని తెలియనివ్వు
ఎండినగడ్డీ, ఎండుటాకులూ, కాలినకట్టెలూ, రాలినపూలూ
నీ సంపదలని గ్రహించనివ్వు

రవితేజా
నీ దర్శనానికి అడ్డువచ్చే మంచుతెరలని నీవే ఛేదించు
సౌందర్యరూపా
తెరలు తొలగించి నీ కనుల కటాక్షం మాపై కురిపించు

*5.5.87*

## 41

సత్యమనే వజ్రాన్ని
నాకు బహూకరించావు
నా సంపద నంతటినీ
దానితో పరీక్షించి చూసాను

ఈనాడు నాకే సంపదా లేదు
ఆ వజ్రం తప్ప

. . .

నిద్రించి నేను కలగంటున్నపుడు
సుఖదు:ఖాలు అనుభవించాను
అశాశ్వతాలని పలవరించాను

వెలుగులోనికి నా కనులు తెరుచుకొన్నపుడు
సుఖదు:ఖాల, శాశ్వతాశ్వతాల
ప్రసక్తే లేకుండాపోయింది

*29.5.87*

## 42

నరాలచురుకు
తాత్వికులని మాట్లాడిస్తుంది

'సౌందర్యం ప్రపంచంలో లేదు
సౌందర్యం పరమాత్ముని సొత్తు'

'ప్రపంచంలో సౌందర్యమే వుంది
ప్రపంచం పరమాత్ముని ప్రతిబింబం'

మౌనం వారిని వరించే ముందు
ఇలా అంటారు

'సౌందర్యమేదో, కానిదేదో మాకు తెలియదు
ఏది ఉందో, ఏది లేదో కూడా తెలియదు

మాకు ఏమీ తెలియదు'

*29.5.87*

## *43*

*బాధామయమైన ఆనందాన్ని కలిగించే యాత్ర నాది*
*ఇది అంతమౌతుందో, లేదో తెలియదు*
*అంతమౌతుందేమో నన్న దిగులు పోలేదు*

*కంటి ఎదుట కనిపించిన క్షణం*
*వేగంగా రెప్ప మాటున అదృశ్యమై పోతుంది*

*గాలి వీచింది. ఎండుటాకులు దొర్లాయి*
*అనంతర నిశ్శబ్దం కూడా ఆపలేదు*
*యాంత్రికంగా పడే అడుగులని*

*అరణ్య వృక్షచ్ఛాయలో కాంత ఎదురుచూస్తుంది*
*ఆమె ప్రేమలో ఏనాడో ఐక్య మయ్యానని*
*తెలిసిన యాత్రికుడు ఏ మాత్రం ఇక విశ్రమించడు*

*1.6.87*

## 44

నన్ను బాధ పెడుతున్న అనంత సౌందర్యం
నేను మరణించినరోజున తనలో కలుపుకొంటుందేమో

ఆ రోజున
సముద్ర కెరటాలపై తేలివచ్చే గాలినై
పసివాళ్ళ చెంపలు నిమురుతాను

రాత్రి నిశ్శబ్దంగా భూమిపైకి జారే వెన్నెలనై
దంపతుల వలపుభావాలకు వన్నెలు తెస్తాను

అనంతకోటి నక్షత్రాలలో ఒక్కటినై
విశ్వ వికాసానికి సాక్షిగా నిలుస్తాను

అడవులలోని అనంత నిశ్శబ్దాన్నై
మౌనద్వారానికి కావలి కాస్తాను

ఎడారి వ్యాపించినంత దూరం
కనిపించని వేడిమిలో కలిసివుండి
తెలియరాని గమ్యాలకు దారులు తీస్తాను

ఏటి గలగలలో, సాగరపు నురుగులో,
పచ్చికబయలులో, లేత ఎండలో
మీకు కనిపించకుండా వుండి
మీచే పూర్తిగా ప్రేమించబడతాను

*1.6.87*

## 45

ఏమీ  ప్రశ్నించను నిన్ను
ప్రశ్న లేని సమాధానాన్ని ప్రసాదించావు నీవు

అనంతమైన బాధను ఎందుకు కలిగించావని అడగను
అపారమైన కరుణలో మునిగివున్నానని గ్రహించాను

మాపైన కాఠిన్యం వహించటానికి
నీవెంత కరుణ కలిగివున్నావో తెలుస్తోంది

నాకు ప్రార్థించటం తెలియదు
ధ్యానించటం తెలియదు

నీ కొరకై యాత్ర చేయలేని పసివాడిని
హఠాత్తుగా నీ ఒడిలోనికి తీసుకొన్నావు

నీ దయా సముద్రం లోనికి తీసుకు వెళుతున్నపుడు
మాటిమాటికీ మనస్సు మూగపోతుంది

ఇక ఏం కోరను నిన్ను
కోరికలను తీర్చే నిన్నే నన్నుగా అనుగ్రహించాక

*5.6.87*

## 46

కృశించిన తనువుతో
తటాకం సమీపాన పూలతో కప్పబడి వున్నాను

నాకు తెలియని సమయాన వచ్చి
వరమాల నా మెడలో వేసావు

చెలులతో ఈ సంగతి చెప్పుకొనబోతే
పొదలమాటునుండి వద్దని వారించావు

ప్రభూ
చివరికి నీవద్దకు రప్పించుకొన్నావు

ప్రియులనీ, పంటచేలనీ, సాయంసంధ్యలనీ
నాకు మిగలకుండా చేసావు

నీముందు శిరస్సు వంచి నిలబడ్డాను

నా మెడపై ఖడ్గం వ్రాలేదీ
పూలమాల వెలిసేదీ సాటివారికి తెలియనివ్వు

*8.6.87*

*47*

సుఖదు:ఖాలకు భయపడి
ఒదిగి మూల కూర్చున్నపుడు
కోరికలని పుట్టించి నాలో చేతన నింపు

మంచిచెడులని చూడక
కోరికల వెంట పరుగు పెట్టినపుడు
పరిపూర్ణసుఖాన్ని ఇచ్చే మంచికి నన్ను మరల్చు

సుఖం అనంతమై
నన్ను తనలోనికి తీసుకొంటున్నపుడు
దానికి మూలమైన విశ్వసాక్షిలా నన్ను నిలిపివుంచు

*20.6.87*

## 48

ప్రభాతకాంతి
ఈ లోకానికి నూతన ఉత్సాహాన్ని ఇస్తుంది
భయం నుంచి ధైర్యానికి,
నిరాశ నుంచి ఆశకి లోకాన్ని మేల్కొలుపుతుంది

రాత్రి చిక్కని చీకటి వలే, నిశ్శబ్దం వలే
భయ సంకోచాలతో
నా మనస్సింకా ముడుచుకుపోతూవుంది

దినం తరువాత దినం కదిలిపోతూనే ఉంది
'నేను' ఒక ప్రశ్నలా నిత్య నూతనమై పుడుతూనే ఉంది

ఓటమి ఎరుగని జీవితానికి చేసే యాత్రలో
అడుగడుగూ అపజయానికి దారితీస్తుంది

ఎవరిని ప్రార్ధించటానికి ఈ చేతులు పైకి ఎత్తను
సమాధానాలు కోరే ప్రశ్నల సముద్రంలో
ఇది కూడా ఒక బిందువులా కలిసిపోయింది

సత్యమనేది ఉందని తెలిసాక కూడా
అల్పునిగానే మిగులుతున్నాను

లేత ఎండనీ, పచ్చిక బయళ్ళనీ
లోకానికి కానుకలుగా ఇచ్చినవారినే
నాకు విశ్రాంతినీ, శాంతినీ ఇవ్వమని కోరుతున్నాను

*29.7.87*

## 49

నిన్ను ఊహించటం కూడా రాని హృదయంతో
నీవు కావాలని ఆతృత పడుతున్నాను

మౌనంలో దాగిన నిన్ను పిలవాలని వెర్రిగా అరిచినా
ఆ పిలుపు నీకు అందదని తెలుస్తూనే ఉంది

నా గొంతు నన్ను నీకు
దగ్గర చేస్తుందో, దూరం చేస్తుందో తెలియటంలేదు

ఏమి కోరినా ఇవ్వటానికి నీవున్నావు
ఏ కోరిక నిన్ను చేరుస్తుందో తెలియక నేనున్నాను

నిన్ను నాకు ఇవ్వటమంటే
నన్ను నాకే ఇవ్వటమని తెలిసినా
నువ్వు ఇవ్వకుండా నేనే అడ్డుపడుతున్నాను

*2.9.87*

## 50

నిన్ను చేరాలన్న కోరిక
ఈ హృదయం ఉన్నంత కాలం
దాని లోతులోతుల వెంట ప్రవహించనీ

నా అర్హతలను ఏ మాత్రం వృధా చేయకుండా
నిన్ను అర్థించటానికి వ్యయం చేయనీ

అన్ని కాలాలూ, అవస్థలూ కలిగిన నీవు
పరిమిత పరిధుల నుండీ
అవస్థల నుండీ విముక్తుడిని చేయి

కాంతీ, నాదమూ, సౌందర్యమూ
ఏకమైన చోటున ఉన్న ఈశ్వరా

కాంతిలో, నాదంలో, సౌందర్యంలో
నేను కరిగేటట్లు అనుగ్రహించు

*2.9.87*

## 51

ఉదయం వికసించింది, పుష్పాలు రేకులు విప్పాయి
తుమ్మెద వాలింది, గాలితెర కదిలింది

నన్ను ఎరిగిన నా మిత్రుడు
నా ముఖంలోకి చూసి చిరునవ్వు నవ్వాడు

. . .

ఈ ప్రపంచం ఎందుకు పుట్టిందో
నేను తెలుసుకొన్నాను

ఈ మధ్యాహ్నం మామిడిచెట్టు నీడలో
కోయిల చెప్పింది ఆ రహస్యం

. . .

ఈశ్వరుని గురించిన
అన్ని ప్రశ్నలకూ సమాధానం అర్థమైంది

కడలి ప్రతి తరంగమూ ఈశ్వరుని నాకు బోధిస్తోంది
నేలకువాలే ప్రతికిరణం ఆయనను నాకు చూపిస్తోంది

*1.10.87*

## *52*

నేను ఒంటరివాడినని భ్రమపడినప్పుడు
నిశ్శబ్దపు చీకటి రాత్రి మెరిసే నక్షత్రాలు
సృష్టిని గురించిన అనేక ప్రశ్నలుగా దర్శనమిస్తాయి

నేను విశ్వబాంధవుడని గ్రహించినప్పుడు
నిశ్శబ్దపు చీకటి రాత్రి మెరిసే నక్షత్రాలే
సృష్టి పరిపూర్ణత్వాన్ని మౌనంగా తెలియజేస్తాయి

. . .

నేనొక చీకటి గదిలో
నిర్విరామ శోకంతో నిండి వున్నప్పుడు
కాలం నా భుజాలపై మోయలేని బరువుగా తోస్తుంది

నేను వెలుతురు లోనికి ప్రవేశించినప్పుడు
కాల ప్రవాహంలో  నీటి బిందువునని గ్రహిస్తాను

*1.10.87*

## 53

ఇప్పటిలాగే ఎల్లకాలమూ
ఇక్కడ వుండిపోవాలనే ఆశతోనే ప్రయాణిస్తున్నాను

మరణం ఆహ్వానగీతం పాడిన రోజున కూడా
ఆ మరుసటి రోజు ఎలా వుంటుందో చూడాలన్న
ఆశ నాలో మిగలవచ్చు
శాశ్వతంగా ఇక్కడ వుండే మార్గంలేదా అనిపించవచ్చు

కానీ, నాకు తెలుస్తోంది
మరణమనేది వుంది గనుకనే
జీవితమింత విలువైనది అయింది

ఏదో ఒకరోజు
ఇక జీవితం దొరకదు కనుకనే

అవిశ్రాంత కార్య కలాపాలూ, అంతులేని స్తబ్దతా
ఈ జీవితం వెంట ప్రవహిస్తున్నా
దీనిపట్ల అనురక్తి పొందకుండా ఉండలేను

*4.10.87*

## *54*

అంతులేని ఆలోచనల నుండీ,
అనంతమైన బాధ నుండీ
దేహం విశ్రాంతి కోరుకొనే రోజు వస్తుంది

ఇది దహనమైన మరుభూమిలో మొలిచే పచ్చికని
పైరగాలులు నాట్యం చేయిస్తాయనీ
మంచుబిందువులు చుంబిస్తాయనీ తలచినప్పుడు
ఆనందమూ, ఆశ్చర్యమూ కలుగుతాయి

మరణించాక
ఈ లోకంనుండి మాయమౌతామో
లోకమంతా వ్యాపిస్తామో తెలియదు

పసివాళ్ళ కేరింతలలోనూ
అరణ్యాల నిశ్శబ్దంలోనూ
సాయంకాలపు బంగారుఎండలోనూ
కలిసేటట్లయితే

మరణాన్ని త్వరగా రమ్మని ప్రార్థిస్తాను

*4.10.87*

## 55

ప్రభూ!
వేసవికాలపు ఉదయపు గాలిలో
నా తుది నిశ్వాసం లయమైనప్పుడు
నీ తేజస్సు నన్ను స్పృశించు గాక!

శరద్రాత్రి వెన్నెలలో
నేను విశ్రాంతిలో చేరుతున్నప్పుడు
నీ అనంతమౌనం నన్ను స్వీకరించు గాక!

కడలి కెరటాలను
నా పాదాలు కడసారి తాకినప్పుడు
ఆకాశపు అవధుల నుండి నన్ను ఆహ్వానించెదవుగాక!

వికసిత కుసుమాలపై
నా తుదిచూపు ప్రసరించినప్పుడు
నన్ను నీలో కలుపుకొందువు గాక!

*11.10.87*

## 56

లోకాన్ని ప్రేమించే
ఉదయపు గాలిని సృష్టించిన
ఈశ్వరునికి ధన్యవాదాలు

సామ్రాజ్యాలను జయించినా, కీర్తి విస్తరిల్లినా
చిరుగాలికి పచ్చగడ్డిపై ఊగే
బంగారపు ఎండను చూసి మౌనంలో పడకపోతే
జీవితపు విలువలు తెలియవు

. . .

ఏ సంపదలూ పొందలేకపోవటం
ఏ సంపదలోనూ తృప్తిలేకపోవటం

సత్యంవైపు తిరగటానికి
మానవులకి లభించే రెండు అవకాశాలు

*21.10.87*

## 57

దినమంతా మేఘాలు క్రమ్మినప్పుడు
అమ్మ ఒడిలో ఉన్నప్పటి పసితనం వదిలి పోలేదని అర్థమైంది

నా మౌనం అరణ్య నిశ్శబ్దంలో లయం అయినప్పుడు
నా నిట్టూర్పు కెరటాలచే ఆహ్వానించబడినప్పుడు
నేను జీవించే ఉన్నానని నాకు స్పష్టమౌతోంది

ఈశ్వరుడు ఎక్కడో ఉన్నారన్న భ్రమ
నానుండి దూరమౌతోంది
విశ్వసౌందర్యం చేసే
అవిశ్రాంతనర్తనాన్ని చూడగలుగుతున్నాను
కాలవాహినిలా ప్రవహించే
అమరగానాన్ని వినగలుగుతున్నాను

ప్రపంచమే ఈశ్వరుడనీ,
నేను ఈశ్వరునిలో కలిసాననీ అర్థం చేసుకొంటున్నాను

ఇప్పుడు జననం, మరణం
అర్థరహితమైన పదాలుగా కనిపిస్తున్నాయి

నేనెప్పుడు పుట్టానో నాకు తెలియటంలేదు
నేను మరణిస్తానన్నది అర్థం కావటం లేదు

*21.10.87*

*58*

నా జీవితాన్ని పాలించే
మహారాజ్ఞి రాక కోసం
నా హృదయ మందిర కవాటాలు తెరిచి,
నా నిండా వెలుగు నింపుతాను

సజీవ, నిత్య చైతన్య ప్రకృతి సంపదకు
మా చిన్ని హృదయాల కలయిక
మణి కిరీటమై నిలవాలి

కాల ప్రవాహం వెంట సాగే
సాధారణ జీవనం నుండి వేరుపరచి,

మా ప్రేమ మమ్మల్ని
నక్షత్రాల కాంతిలో, అనంతత్వంలో, మౌనంలో
నిలిపి ఉంచుగాక!

*26.10.87*

## 59

నీ గురించి పడే బాధ కూడా
ఆనందాన్ని కల్గిస్తుంది
నీ విచ్చిన అమృతం మహిమ ఇది

వాగు ఒడ్డున
నీ ధ్యానంలో కూర్చొన్నపుడు
నీ మృదుగమనమూ, కలభాషణమూ,
నిర్మలహృదయమూ
మరింత స్పష్టంగా దర్శించ గలిగాను

నీ తోడు లేని ఏకాంత సంధ్యలో
నీ స్మృతిలో కరుగుతున్నప్పుడు
నీ గాంభీర్యమూ, మౌనమూ,
సౌందర్యమూ జ్ఞాపకం వచ్చాయి

*26.10.87*

## 60

మరణానికి భయపడిన ప్రతిక్షణమూ
మరణించే ఉన్నాను

జననం మరణం అర్థం తెలియనిచోట
దైవం నన్ను నిలిపినప్పుడు
యదార్థంగా జీవిస్తున్నాను

. . .

మనస్సు తృప్తిగా ఉంది
ఈమాట
పదేపదే లోతులవెంట వచ్చేదెప్పుడు

ఈ జీవితాన్ని పరిపూర్ణంగా ప్రేమించినప్పుడు
ప్రకృతి సౌందర్యం చెదరకుండా ఎదుట నున్నప్పుడు

*16.10.88*

## 61

విషాదహృదయాన్ని
కాలంవెంట మోసుకుపోతున్నాను

కన్నీటికీ అర్థంకాని బాధకి
కన్నీరు మాత్రం ఎలా వస్తుంది

వెలుతురు వచ్చి కాస్త కదిలించినా
బరువెక్కిన మనస్సు చీకటివైపే చూస్తుంది

ఇంత విషాదం లోతులోనూ
జీవితాన్ని ప్రేమించటం మానను

అనుభవం నాలోనికి ప్రవహిస్తుంది
దీనికి ఎవరికీ కృతజ్ఞతలు చెప్పుకోను

*20.10.88*

## *62*

పిట్టల కూతలు గాలిని కావలించుకొని
ఉదయకాంతికి స్వాగతం చెబుతున్నాయి

మంచుబిందువు ముద్దుని పొందుతున్న పుష్పాన్ని
ఉదయకాంతి ఆశీర్వదిస్తుంది

పసిపాప నుదుటిని చిరుగాలి చుంబిస్తుంది
కనులు తెరవని పాప
గాలికి చిరునవ్వుని అద్దుతుంది

చెరువులో జారిపడిన ఎండుటాకు
తన అనుభవాలని చెరువుకి వివరిస్తుంది

నిశామాత ధరణికి ఓదార్పుని పంచుతుంది
అహంకారి మానవుడు
లోకంలో ఒంటరిగా మిగిలాడు

*20.10.88*

## 63

ప్రేమికుని మనస్సు
ఈ లోకంలో ఏకాకి అని
కొందరు
జీవంలేని సానుభూతి చూపిస్తారు

అది లోకాన్నంతా
తనలో నిలుపుకొన్నదని
తెలిసినవారు
వారి అమాయకత్వానికి నవ్వుకొంటారు

*20.10.88*

## 64

ఏ బాధలు జీవితానికి విలువ నిస్తున్నాయో
ఆ బాధలని ఆహ్వానించకుండా ఎలా ఉండటం

నా హృదయంలో దిగిన ప్రతి శల్యానికీ
నా కన్నీటిని కానుకగా ఇస్తాను

ఈ జీవితం తృణప్రాయమైనా, క్షణభంగురమైనా
దీనిని పొందిన మనస్సు
సంతోషాన్ని పొందకుండా ఉండలేదు

లేనిచోటికి వెళ్ళటం కోసం
బ్రతుకంతా సిద్ధం కావటంలో ఎంత ఆనందం ఉంది

*22.10.88*

## 65

వెన్నెల మౌనంగా
భూమికి వర్షిస్తూనే వుంది

కడలి కెరటాలు
భావికాలపు  సమాచారాన్ని ఒడ్డుకు చేరవేస్తున్నాయి

సృష్టి నిరంతరమూ
కాలాన్ని తన అలంకారాలతో సాగనంపుతోంది

నక్షత్రాలు నిశ్చలంగా
సర్వానికీ సాక్షిత్వం వహిస్తున్నాయి

నాకు సంతోషాన్నిచ్చే ప్రతి విషయమూ
నీ రూపమే అయినందుకు గర్విస్తున్నాను

*21.11.88*

*66*

నన్ను పాలించే, లాలించే అనుభవాలు అనేకం
కాలం నాకు కానుకగా ఇచ్చింది

అనేక అనుభవాలు పుష్పాల వలె
నా మనస్సుపై రాలి
నాకు సుగంధాన్ని ఇస్తున్నాయి

వాటిని నేను అనుక్షణమూ ఏరుకొంటూ వున్నా
ఈ హృదయపాత్రలో
ఇంకా ఖాళీ ఉండనే వుంది

అనుభూతుల కుసుమాలని
ఎప్పటికప్పుడు దండగా కూర్చుతున్నాను

మరిన్ని అనుభూతుల సుమాలని కూర్చి
భగవంతునికి హారం సిద్ధం చెయ్యాలి

*21.11.88*

## 67

కాలం అనుభవాల రూపంలో
అనంతగానాన్ని వినిపిస్తుంది
గానానికి తన్మయమైన మనస్సు
నిరంతరం నాట్యం చేస్తుంది

సంస్కారాల గవాక్షాలవెంట
గది అంతా వెలుగు పరుచుకొంటుంది
గదినిండా వెలుగునిండే వరకూ
ఈ ప్రవాహం వస్తూనే వుంటుంది

ఈశ్వరుని కాంతివంతమైన స్పర్శ
ఎలా ఉంటుందన్న ప్రశ్న మనస్సుకిలేదు
అనుభూతులని వర్షించే కాలం ఆగినచోట
ఈశ్వరుడున్నాడని మనస్సుకి తెలుసు

*21.11.88*

## 68

శూన్యమవుతున్న జీవితానికి
ఒకే ఒక ఆధారం నువ్వు

ప్రేమా, కరుణా కుసుమాలతో
నిన్ను ఆరాధించలేని క్షణాలలో కూడా
నువ్వు ఉన్నావనే ధైర్యమే జీవింపచేస్తుంది

రక్షించమని కోరే శక్తి లేనప్పుడు కూడా
నువ్వు రక్షిస్తావనే ఆశ బలాన్ని ఇస్తుంది

అర్థంలేని కార్యకలాపాలూ, ఆశలూ, ఉద్వేగాలూ
ఉన్నట్టుండి ఒంటరిగా వదిలేసినప్పుడు కూడా
నీపైన నమ్మకం మాత్రమే కాపాడుతూ వుంది

. . .

నీవు నాకిచ్చిన శూన్యపాత్ర
నా దురదృష్టం వలన మరింత విశాలమవుతుంది

నీ సమీపంలో గడిపిన కాలామృతాన్ని
దానిని నింపడానికి సరిపడా సంపాదించలేకపోయాను

*9.12.88*

*69*

ఈ దేహం, ఈ ప్రపంచం
ఇలాగే నిరంతరం మరణిస్తూ, పునర్జీవిస్తూ
నూతనత్వంతో, బాధతో రమిస్తూ
ముందుకు సాగుతున్నాయి

బాధ
ఈ జీవితానికి తాత్పర్యమని తెలుస్తూ వుంది
ఏ మహావేదన
కాలాన్ని ప్రసవించిందో ననిపిస్తూ వుంది

*22.12.88*

## 70

వేకువ రెక్కలు విప్పుతోంది
చీకటి దుప్పటి కప్పుతోంది
కాలం ఇంకా కదులుతోంది
ఒక మహార్ణవం పొంగి ప్రవహిస్తోంది

వెన్నెలా, కెరటాలూ, వేకువా, పక్షుల రవాలూ
మానవుని అసంతృప్తీ, అరణ్యాల గాంభీర్యం
మా వెనుకనే, మా లోతులలోనే
సత్యం ఉందని చెబుతున్నాయి

ఏకాకితనంలేని ఐక్యతలో
అన్నీ పరిభ్రమిస్తున్నాయి
చెక్కుచెదరని దీపపుకాంతి
వెలుగురేకల్ని విస్తరిస్తోంది

*22.12.88*

## 71

ప్రశ్నా పరంపరలతో
నన్ను నేను వేధించుకొంటున్నపుడు

నన్ను తాకిన వాన చినుకు
ఆకాశంలో మెరిసే
ఇంద్రధనస్సును చూడమని చెప్పింది

సప్తవర్ణాలలో
నా చూపులు కరుగుతున్నపుడు

నన్ను గురించీ,
ఇంద్రధనువు గురించీ
ప్రశ్నించాలన్న ధ్యాసే
నానుండి మాయమైంది

*22.1.89*

## 72

మంచుబిందువు వణికింది
గాలి మరొకసారి నిట్టూర్పు విడిచింది
కాల సాగరంలో మరొక క్షణం కరిగిపోయింది

రాత్రి ఆకాశానికి నక్షత్రాలు వీడ్కోలు పలుకుతూనే వున్నాయి
సాగరం మరొకసారి ప్రభాత కిరణాలను ప్రసవిస్తూనే వుంది
నా గుప్పెడు హృదయం ఈశ్వరగానానికి స్పందిస్తూనే వుంది
క్షణాల పరదాలను తొలగించుకొంటూ కాలంవెంట యాత్ర సాగుతూ వుంది

మరొక వేకువ నీకు నీరాజనం ఇవ్వటానికి వస్తుంది
పుష్పాలు తమ అలంకారాలను నీ కోసం సిద్ధం చేసుకొంటున్నాయి
నీకు దారి ఇవ్వటానికై మంచుపరదాలు ప్రక్కకు తప్పుకొంటున్నాయి
కానీ, నిన్న రాలిన ఎండుటాకు తన చివరి వీడ్కోలు తెలుపుతూనే వుంది

కడలికెరటాలు మరొకసారి తమ నాట్యం ముగించక తప్పదు
పూబాలలు మరొక సాయంత్రం వాడి రాలిపోక తప్పదు
ఈ కనులు మరొకసారి చీకటిని ఆశ్రయించక తప్పదు
మరొక ఊపిరి హృదయంలోకి ప్రవహించాలంటే నిశ్వాసించక తప్పదు

*7.2.89*

## 73

ప్రపంచాన్ని సమ్మోహింపచేయగల
అద్భుతమైన కావ్యగానం
నా నుండి వచ్చినా

అది ఏమాత్రమూ
నా ప్రతిభ కాదనే స్పృహని వుంచు

ఎండిన చిన్న గడ్డిపోచ లభించినా
దానిని
అమితంగా ఆనందించగల ఉల్లాసం నాలో వుంచు

*8.2.89*

## 74

‘జననం నుండి మరణానికి
వారధి నిర్మించేది కాలం కాదు, ప్రేమ’

కడలి కెరటాలు ఉవ్వెత్తున ఎగురుతూ
నా స్నేహానికి చేతులు చాచినప్పుడూ

రాత్రి బాధల పల్లవిని మననం చేసుకొనేవేళ
నక్షత్రాలు నా నుదుటిని ముద్దు పెట్టుకొన్నప్పుడూ

సాయంత్రం ఉండి ఉండి గాలికి కదిలిన ఆకు
మౌనంగా నిలిచిన నన్ను ‘ఏమిటి విశేషాలు’ అని అడిగినప్పుడూ

నేను అమితంగా ప్రేమించే జీవితం నుండి
అత్యమితంగా ప్రేమించే మృత్యువు వేరు చేస్తున్నప్పుడూ

నేను ప్రేమించినవారు గుర్తుకువచ్చి
నా కన్నులలో కాంతులీనే వెలుగు
వారికి శ్రేయస్సు కలిగిస్తుందనుకొంటాను

*8.2.89*

*75*

నీ మనసును
ఎన్ని వైపుల నుండి, ఎంత లోతుగా గ్రహించగలిగితే
ఈ ప్రపంచాన్ని
అన్ని వైపులకు, అంత స్పష్టంగా చూడగలుగుతావు

నిన్ను ఎంత గాఢంగా, నిర్మలంగా ప్రేమించగలవో
అంత గాఢంగా, నిర్మలంగా ఇతరుల్ని ప్రేమించగలవు

మరణాన్ని ప్రేమించటం తెలిసినప్పుడు
జీవితాన్ని ప్రేమించటం మొదలుపెడతావు

*8.2.89*

*76*

నువ్వు నా ఎదుటే ఉన్నావు
నేనింకా కనులు మూసుకొనే
నిన్ను చూడాలని ప్రయత్నిస్తున్నాను

నా కనురెప్పలపై
నీ కాంతి ప్రసరించటం తెలుస్తూనే వుంది

స్వప్నాలనే నెమరువేస్తున్న చిత్తం
వాటిని తెరుచుకోనీయటం లేదు

*19.2.89*

*77*

శరీరం మనస్సుకు బరువౌతుంది
జగతి మనసు కొక స్వప్నమౌతుంది

విశాల మైదానాల్లో
వెన్నెల ఏకాంతంగా విశ్రమిస్తున్నపుడు

ఉదయపు మంచు తెమ్మెరలు
పొలాలపై పవళిస్తున్నపుడు

నేననేది నానుండి నశించి
నానుండే జగమంతా పరివ్యాప్తమౌతోంది

నే నీ జగమంతా వ్యాపించాను అనే చోటునుండి
ఈ జగమంతా నాలోనిదే అనే చోటికి
ఇంకా ఎంత దూరం వుంటుంది

*26.2.89*

## 78

నిన్నింకా చేరలేదేమని
మనసు ప్రశ్నించటం మానివేసింది

ఏ వేదన జీవితాన్ని ప్రసవించిందో
ఆ వేదన వదలనిపిస్తుంది

మొగ్గ తన దళాలను విప్పుకొని
లోకాన్ని ఆహ్వానించటానికీ
దానిలో భాగం కావటానికీ జంకుతోంది

తనని ముద్దిడబోయే సూర్యకాంతినీ
నర్తింపచేసే చిరుగాలినీ
దళాలను విప్పుకొనని మొగ్గ సందేహిస్తూనే వుంది

వేదన తాను నశించాలని కోరుకొంటోంది
నశించాలనే కోరిక ద్వారానే తనని పెంచుకొంటోంది

వేదన నశిస్తే కాని ఆనందం కనిపించదు
ఆనందం తాకితే కాని
వేదన ఆధారాన్ని మనసు విడువదు

*8.3.89*

## 79

ఒకప్పుడు
నేనున్నాననీ, నువ్వు లేవనీ
అనుకొనేవాడిని

ఇప్పుడు
నువ్వున్నావనీ, నేనూ వున్నాననీ
అనిపిస్తోంది

నువ్వే వున్నావనీ, నేను లేననీ
ఎప్పుడు తెలుస్తుంది

*8.3.89*

80

ఏ కన్నీరూ ఈనాడు జారటం లేదు
ఏ మాటా మనస్సుకి అందటం లేదు

నిన్ను చూడలేక పోతున్న బాధ మినహా
జీవితాన్ని ప్రేమించదగిన అనుభవాలతో నింపినందుకు
తృప్తి కలుగుతోంది

కాలం కదులుతుంటే
కార్యకలాపాల మధ్య తిరుగాడుతూ
నీ స్పర్శ కోసం ఎదురు చూస్తూనే వున్నాను

నీలోనే నన్ను కట్టి వుంచుకోవటాన్ని
ఊహ అందుకొంటూనే వుంది
అనుభూతికి అందకుండానే వుంది

ఇప్పటి వరకూ నిన్ను చేరలేదేమని బాధ
ఇప్పుడు క్షణం క్రితమే నీనుండి దూరమైన వ్యాకులత

స్వప్నాస్వప్నాల మధ్య, జాగ్రత్ సుషుప్తుల మధ్య
కొట్టుమిట్టాడుతూ ఇక్కడ నేను

ఏ వినోదాలూ లేని చోట
ఏ విషాదాలూ తాకని చోట కాంతితో నీవు

*19.3.89*

## 81

ఏదో విధంగా నిన్ను స్మరించకుండా వుండలేని
బలహీనురాలిని చేసావు ఈ హృదయాన్ని

ఏపాటి సంతోషమో స్పృశించి నప్పుడు
'కృతజ్ఞుడిని ప్రభూ' అంటూ గానం చేస్తోంది

అన్ని బంధాలూ విడచి దూరంగా నిలిచినప్పుడూ
'ఇంకా ఎన్నాళ్ళు ఈ యాత్ర' అని ఆలపిస్తోంది

కానీ, తృప్తి దాని గమ్యాన్ని వెదుకుకొంటూ
వాటికి కూడా వీడ్కోలు పలుకుతోంది

*27.3.89*

## 82

అహాన్ని బైటికి పొమ్మని ఆజ్ఞాపించాను
కానీ, తన మెడ పట్టుకొని తననే తోసుకోలేదని మరిచాను

'నేను' ఎక్కడ వుందో మనస్సుకి తెలియటంలేదు
తానే దానిని పోగొట్టుకొని వెదుక్కొంటున్నట్టు వుంది

. . .

నా చుట్టూ నువ్వున్నావని చెబుతున్నారు
నిన్ను చూసేందుకు ప్రయత్నిస్తే
నా కనులు ఎక్కడున్నాయో కనిపించటంలేదు

నిన్ను నీవు చూసుకోగలవో, లేదో తెలియదు
నేనూ నువ్వే అంటుంటే
నా కనులు నాకు చూపించటంలేదు

. . .

ప్రపంచాన్ని ప్రేమగా నిమరాలని చేతులు చాస్తే
వాటికి ఏమీ తగలటంలేదు
చేతులేమయ్యాయో కనిపించటంలేదు
ఏది దేనిని తాకాలి

మూసిన కనులకు ఏది కనిపిస్తుందో అదే నేను
విశ్రమించిన శరీరాన్ని ఏది తాకుతుందో అదే నా ఉనికి
ఎవరిని 'నేను'గా గ్రహిస్తానో వారినే నమ్ముతాను

*27.3.89*

## 83

నన్ను నేను క్షమించటం ద్వారా
ఇతరులని కూడా క్షమించనివ్వు

నన్ను నేను నమ్మటం ద్వారా
ఇతరులని కూడా నమ్మనివ్వు

ఇతరులని ఓదార్చటం ద్వారా
నన్ను నేను ఓదార్చుకోనీ

ఇతరులని ప్రేమించటం ద్వారా
నన్ను నేను ప్రేమించుకోనీ

*20.6.89*

## 84

బాధను దూరం చెయ్యమని అడగడం లేదు
బాధను నా లోలోతుల లోనికి
ఆహ్వానించగల శక్తి నివ్వు

ఎక్కడ బాధా, ఆనందమూ ఏకమౌతాయో
అక్కడకు బాధే చేర్చగలదని తెలుసు

ధూళి కలిసే కుసుమం కూడా
పాషాణం కన్నా అందమైనది

ఏ నిస్తబ్దస్థితి కన్నా
బాధలా చలించే చైతన్యం విలువైనది

*28.7.89*

## 85

మన దాగుడుమూతలు మళ్ళీ మొదలు
ఒకరికొకరం దొరికిపోవాలనే ఆశతో ఆడుకొంటున్నాం
అనంతమైన క్షణాల తరువాత మరలా కలుసుకొంటాము
మనం ఒకరికొకరం క్రొత్తవారం కావటం సంతోషాన్నే కలిగిస్తుంది

మనం పరస్పరం ప్రేమించుకొన్న సంగతి
మన మనస్సులకు మాత్రమే తెలుసు
మన కన్నులు మన మధ్య పరిచయాలు లేనట్లే చూసుకొన్నా
మన మనస్సులలోని సౌందర్యం పరిసరాలను వెలిగిస్తూనే ఉంటుంది

నేనెవరో తెలియనట్లు చూస్తావు
నాతో చెప్పించుకోవాలని నీ కోరిక
నీవే నేనని నీకు తెలుసని
నేను చెప్పకూడదనుకొన్నా నా చిరునవ్వు చెపుతుంది

*30.7.89*

## 86

నేననేది నాకు తెలియటంలేదు
ప్రియురాలిని ఈశ్వరా అంటున్నాను
నిన్ను ప్రియా అని పిలుస్తున్నాను
హృదయం  రెండూ సరైనవే అంటుంది

నీ కోసం ఎదురుచూడటంలో ఆనందం పోయింది
నువ్వు రావని నమ్మటానికి ప్రయత్నించటంలో
ఆనందం వుంది ఇప్పుడు
ఏ విధంగానైనా  నీ గురించి ఆలోచించటం కావాలి

ప్రపంచ పరిభ్రమణం ఆగిపోనీవు
నీ గురించి వేదన మాత్రం తొలగనీకు
నాకు తెలుసు, నీ పట్ల నా వేదన
ప్రపంచానికి కూడా శక్తి నీయగలదని

*30.7.89*

# బయోడేటా

| | | | |
|---|---|---|---|
| పూర్తిపేరు | : బొల్లిన వీర వెంకట ప్రసాద్ | | |
| పుట్టినతేదీ | : 21. 11. 1966 | | |
| పితామహులు | : బొల్లిన వీరన్న, సత్యనారాయణమ్మ-ముక్కామల, ప.గో.జిల్లా | | |
| మాతామహులు | : భోగవల్లి సుబ్బారావు, సూర్యకాంతం-సూర్యారావుపాలెం, ప.గో.జిల్లా | | |
| తల్లిదండ్రులు | : విజయలక్ష్మి, అచ్యుతం | | |
| తోబుట్టువులు | : నాగేంద్రకుమార్, శ్రీ భవాని | | |
| భార్యాపిల్లలు | : మాలతీదేవి, గాయత్రి, భార్గవి | | |
| రచనలు | : ఆరాధన | (వచన కవిత్వం) | 1989 |
| | దృశ్యాదృశ్యం | (హైకూలు) | 1995 |
| | హైకూ | (హైకూలు) | 1997 |
| | పూలురాలాయి | (హైకూలు) | 1999 |
| | నేనే ఈ క్షణం | (వచన కవిత్వం) | 2006 |
| | ఆకాశం | (వచన కవిత్వం) | 2011 |
| | నీలో కొన్నిసార్లు | (వచన కవిత్వం) | 2015 |
| పురస్కారాలు | : ఆంధ్ర సారస్వత సమితి అవార్డు, మచిలీపట్నం | | 2004 |
| | స్నేహనిధి పురస్కారం; విశ్వకళాపీఠం, హైదరాబాద్ | | 2012 |
| | ఇస్మాయిల్ కవితా పురస్కారం, కాకినాడ | | 2011 |
| | గుంటూరుజిల్లా రచయితలసంఘం అవార్డు, గుంటూరు | | 2011 |
| | నూతలపాటి కవితా సత్కారం, తిరుపతి | | 2011 |
| | కె.వి.ఎస్. ఉగాది సాహిత్య పురస్కారం, ఏలూరు | | 2015 |
| | తిలక్ అవార్డు, తణుకు | | 2016 |
| చిరునామా | : బివివి ప్రసాద్, # 23-12-21, సజ్జాపురం, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్ 534 211 | | |
| ఫోన్ | : 90320 75415 | | |
| ఈ మెయిల్ | : prasadbvv1@gmail.com | | |
| బ్లాగ్ | : bvvprasad.blogspot.in | | |

దినమంతా మేఘాలు క్రమ్మినపుడు
అమ్మ ఒడిలో ఉన్నప్పటి పసితనం వదిలిపోలేదని అర్థమైంది

నా మౌనం అరణ్యనిశ్శబ్దంలో లయం అయినప్పుడు
నా నిట్టూర్పు కెరటాలచే ఆహ్వానించబడినప్పుడు
నేను జీవించే ఉన్నానని నాకు స్పష్టమౌతోంది

ఈశ్వరుడు ఎక్కడో ఉన్నారన్న భ్రమ నానుండి దూరమౌతోంది
విశ్వసౌందర్యం చేసే అవిశ్రాంతనర్తనాన్ని చూడగలుగుతున్నాను
కాలవాహినిలా ప్రవహించే అమరగానాన్ని వినగలుగుతున్నాను

ప్రపంచమే ఈశ్వరుడనీ,
నేను ఈశ్వరునిలో కలిసాననీ అర్థం చేసుకొంటున్నాను

ఇప్పుడు జననం, మరణం
అర్థరహితమైన పదాలుగా కనిపిస్తున్నాయి

నేనెప్పుడు పుట్టానో నాకు తెలియటం లేదు
నేను మరణిస్తానన్నది అర్థంకావటం లేదు